# గోలకొండ పత్రిక

స్వభాను సం॥ర శ్రావణ శు॥ ౧ సోమవారము


# ఫాసిస్టు పతనము

ముసలోనీ ఇటలీ రాజ్యనియంతృత్వానికి స్వస్తి చెప్పుకొన్నాడు. అతని రాజ్యము లఘురుసు కిర్రుమన్నది. ప్రపంచమంతా ఆశ్చర్యపడింది. మన దేశములో ఫాసిస్టులను, కాపురేడ్లు చెడతిట్టుతుంటారు. "ఫాసిస్టు దురాక్రమణమును అణచివేయాలి" "ఫాసిస్టుసిద్ధాంతాన్ని ధ్వంసము చేయాలి" అని మన కామరేడ్లు నినాదాలు చేసినారు, ఆనినాదాలతో ఫాసిస్టు దురాక్రమణము ఇప్పుడు తటాలున ధ్వంసమై మటుమాయమై పోయినది. ఫాసిస్టు అంటేయేమో రెండు మాటల్లో చెప్పివేస్తాము.

గత యుద్ధములో (౧౯౧౪ - ౧౮ లో) ఇటలీ ఇంగ్లీషువారి పక్షంగా జర్మనీతో యుద్ధంచేసింది. కపోరెట్టో యుద్ధములో నెత్తిగ్గాతన్ను తిన్నది. ఇంగ్లీషువారికి మంటలేచి నీకవాలుంటే పిరికి పనిచేస్తివా అని తల, వాచేఅట్లు చీవాట్లుపెట్టిరి. తుదకు జర్మనులు ఓడిపోయినప్పుడు వచ్చినలాభాలను మిత్రమండలి పంచుకొనే కాలములో ఇటలీకి ఏమిన్ని యియ్యలేదు. తూర్పుదిక్కున ఏవో కొన్ని జిల్లాలు దానిమొగాన పారవేసిరి. ఇటలీకి కోపంవచ్చెను. కాని యెవరిని బాధించగలదు. తమ దేశము బాగా బలిష్ఠముగా చేయవలెనని కొందరికి సంకల్పము కలిగెను. వారిలో ముసోలినీ ముఖ్యుడు ౧౯౧౯ మార్చినెలలోనే "ఫాస్సియో" సంఘమును స్థాపించెను. ఇటలీరాజు సాత్వికుడు. విజృంభించుచున్న ఫాసిస్టులను ధ్వంసము చేయగోరలేదు. అదే కారణముచేత ముసోలిని తనవర్గంలో సోల్జర్లను కలుపుకొని రోము ముఖ్యపట్టణంపై "మార్చి" చేసి దాన్ని ఆక్రమించుకొనెను. అప్పటి నుండి మొన్న టివరకుఫాసిస్టులు అవసరం కొద్దీ మారుతూ ఇటలీదేశాన్ని పాలించిరి. ఇటలీనికూడా ఇతర సామ్రాజ్యములవలె గొప్పదేశాన్ని చేయుటకు గాను కారణము లేకుండా ముసోలినీ అబ్సీనియాను దిగ్గ్రమింగెను. అంతకంటే ఆయుధపరికరాలు లేని దేశ మేదికలదా అని అటూయిటూ పారజూచెను. అబీసీనియా కన్నబడింది. పట్టురాదాన్ని అని యాజ్ఞాపించెను. ఏనకేనాప్యుపాయేన, విషవాయువులు విడిచి, నిరాయుధులపై బాంబులు వేసి, అబిసీనియా రాజుకు లోబడినవారికి లంచాలిచ్చి తుదకు దాన్ని గెలుచుకొనెను. ఇదంతయు తనదేశమునకు ఘనత కలిగించుటకే, దీనినే జాతీయత అందురు. ఫాసిస్టులకు ఇతరులకువలెనే అంతర్జాతీయ దృష్టిలేకుండెను. నాదేశం కేవలం నాదేశం అనే మాత్రమే వారు పఠించిరి.

మొదట మొదట ఫాసిస్టులకు ఒక కార్యప్రణాళిక అనేది ఉండింది. ప్రజా పరిపాలనము, స్త్రీసముద్ధరణము, సామ్యవాదము, అంతర్జాతీయత, అవన్నీ మేము సాధించుతాము అని మెట్టవేదాంతాలు చెరిగివేసిరి. కాస్త అధికారములో స్థిరపడిన తర్వాత కార్పరేటు రాజ్యాన్ని స్థాపించిరి. ఇంతకంటే తప్పుడు సిద్ధాంతము, ఇంతకంటే నిరంకుశమైనది ఇంకొకటి లేదు. పైకిచూచేదానికి శాసనసభ ఉండేది. దానికి ఎన్నికలు జరిగినట్లే. సభ్యులు ఎన్నుకొన బడినట్లే. చర్చలు జరిగినట్లే. తుట్టతుదకు అంతా కుంభకోణము! జిల్లావారీగా ఎన్నికలు లేవు. ఇటలీ అంతా ఒకే "యూనిట్" ఒకే కేంద్రము. మొత్తము దేశంనుండి ౪౦౦ మంది ప్రతినిధులు శాసనసభకు పోవలెను. సలహా సంఘాలవంటివి కొన్ని పేర్లను సూచించితే వాటిలోనుండి ఫాసిస్టుగ్రాండు కౌన్సిల్ ౪౦౦ మందిని తమకు నచ్చిన వారిని ఏరుకొంటుంది. పదిమందిచేరి ఒక సంఘముగా ఏర్పడేది. దానిని ఫాసిస్టువర్గమువారు పసందుచేసేది. అట్టివారు సభ్యులను ఎన్నుకొనేది. ఇట్టి నాటకమొకటి జరుగుతూవచ్చినది. అందులో వర్గాలకే ప్రాతినిధ్యము. జనులందరికి లేక ఏక్కువ సంఖ్యాకులకు వోటు అధికారములేదు. ఫాసిస్టుల ఘనత ఏమనగా తమకు సరిపడని సంఘాలనన్నింటిని వరుసబెట్టి ధ్వంసము చేయుట. అట్టి సంఘాలలో సభ్యులు చేరకుండా చేయుట, లేక వారినిహింసించుట లేక అట్టి సంఘాలను రద్దుచేయుట జరిగెను. పత్రికలపై చాలాకఠినమైన పర్యవేక్షణ నేర్పాటుచేసిరి. ఇటలీలోనేకాక బయటిదేశాలలో నివసించే ఇటలీజనులు కూడా తాము చెప్పినట్లుగా వినేఅట్లు శాసించిరి. అంతా రాజులోనే రాజ్యాంగం రాజ్యాధికారం సమస్తం కేంద్రీకరించినది. అని పైకి ప్రకటించిరి. కాని ఫాసిస్టులు సంపూర్ణముగా నిరంకుశులుగా రాజ్యముచేసిరి. మొదట స్త్రీస్వాతంత్ర్య మన్నవారు అధికారంలోకి వచ్చిన తర్వాత స్త్రీ పిల్లలనుకనే మిషను. స్త్రీ పురుషునితో సమానము కాదు. ఆమె ఇంటిలోనుండదగినవస్తువు. స్త్రీ విలాసముగా వస్త్రముల ధరించకూడదు అని ముసోలోనీ ప్రత్యేకముగా శాసించెను. కూలీలు కూలీలే. ధనికులు ధనికులే. వీరు సమానము కాజాలరు. ఈ భేదాలుండి తీరవలెను- అని ఫాసిస్టులు శాసించిరి. ఈ సూచనలచే ఫాసిస్టు సిద్ధాంతాలంటేయేమో పాఠకులుకొంత గ్రహించి యుంటారు.

ఈయుద్ధములో ముసోలోనీ హిట్లరు జతపట్టినాడు. లాభాలు పొందజూచినాడు. కాని ఇటలీ సైన్యము ఎప్పటివలెనే పిరికి సైన్యము. ఎక్కడబోయినా తన్నులుతినివచ్చినట్లే. దాని అనుభవములో ఉండింది. రొమ్మెల్ లిబియాలో పోరాడినంతకాలము ఏదోవిధంగా నిలువగలిగింది. సిసిలీలో ఇంగ్లీషు అమెరికా సైన్యాలు దిగిననాడు వారిపస తెలియవచ్చింది. ముసలోని మాయం. దేశం కల్లోలభరితం. కొత్త మంత్రాంగంలో మార్షల్‌లా. అంతా గందరగోళం. ఇట్లాంటి చిత్రాలు ఇంకా మనం ఎన్ని చూడనున్నామో?

---

# హైదరాబాదు రేడియో తెలుగుకార్యక్రమము

మంగళవారము ౩వ మహారేవర్ ౧౩౫౨ ఫ. నాడు హైదరాబాదు రేడియో తెలుగు కార్యక్రమము ౫గంటలనుండి ప్రారంభమగును. యుద్ధవార్తలు, రికార్డుసంగీతం, జరిగినతర్వాత "కావ్యగానము" శ్రీసన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారిచే చేయబడును.

---

# నిజాంరాష్ట్రములో బట్టలకంట్రోలు ఆజ్ఞ

ప్రభుత్వ ప్రకటన

నూలు, నూలుబట్టలధరలను, ఉత్పత్తిని, అమ్మకమును కంట్రోలుచేయుటకును, ఫ్యాక్టరీయజమానులు, వర్తకులు, సామాన్యప్రజలు నూలు, నూలుబట్టలు నిలువచేయకుండా చూచుటకును ఏవి ఏర్పాట్లు చేయబడనున్నవో తెల్పు ముఘున శ్రీనిజాం ప్రభుత్వమువారి కాటన్ క్లాతు అండు యార్న్ ఆర్డరు ౧౩౫౨ఫ. మెహెరేవర్ ౧౦వ తేదీ (౧౭-౭-౧౯౪౩)నాడు ఒక అసాధారణ జరీదా ద్వారా ప్రకటింపబడినది.

నూలును, నూలుబట్టను తయారుచేయువారును, బట్టలవర్తకులును మెహెరేవర్ ౩౦వ తేదీ (జులై ౩౧ ౧౯౪౩)నాడు వారివద్దనున్న నూలుయొక్కయు, నూలుబట్టలయొక్కయు నిలువ యింతకలదని తెలియజేయవలెను. అట్టి లెక్కలు ౧౩౫౨ఫ. మెహెర్ ౧వ తేదీనాడు (౧౫-౭-౪౩) నిర్ణయింపబడిన అధికారులకు చేరవలెననియు నియమింపబడినది. వర్తకులయొక్క లెక్కలపుస్తకములను పరీక్షించుటకును, దుకాణములు ఫ్యాక్టరీలు వెతికించుటకును, కావలసినవివరములు అడుగుటకును టెక్స్టైల్ కమిషనర్ గారికి అధికారము కలదు.

ఈఆర్డరు హైదరాబాదు రక్షణ నియమావళి క్రింద జారీచేయబడినది. దీనికివ్యతిరేకముగ ప్రవర్తించినవారుగాని, తప్పించుకొన జూచువారుగాని తప్పుడులెక్కలు చూపించువారుగాని ఈనియమావళిక్రింద ౩ఏండ్లవరకు ఖైదుశిక్షగాని, జుర్మానాగాని లేక రెండునుకాని పొందుదురు.

ప్రభుత్వ కార్యాలయములు

౧. డైరెక్టరు, దఫ్తరదివానీ అండ్ మాల్
౨. బెరార్ ఏజెంట్
౩. చీఫ్ కమర్షల్ మ్యానేజర్ ఎన్. ఎస్. రైల్వే, సికింద్రాబాదు.
౪. సెక్రెటరీ, కాన్స్టిట్యూషనల్ అఫైర్స్ డిపార్టుమెంటు
౫. హెడ్ క్వార్టర్ ఆఫీస్, హెచ్.ఇ.హెచ్. ది నిజామ్స్ ఫోర్సెస్.

---

# ఎక్సెల్సియర్ పాఠశాల

ఈపాఠశాలలో తెనుగుద్వారా ప్రైమరీ తరగతులలో చదువుచెప్పించుచు హైస్కూలుఫారములలో తెనుగును దినమొకగంట చెప్పుచు ఉర్దూ ఇంగ్లీషులో ప్యారలల్ తరగతులుపెట్టి అందరికీ సౌకర్యములు కలిగింపబడినవని యిదివరలో రెండుమారులు తెలిపినాము. మరొకమారు తెలుపుచున్నాము. తెనుగువారికిది మంచిఅవకాశము. పాఠములన్నీ సాగిపోవుచున్నవి. ఇంకా ఆలస్యముచేయువారు త్వరగా తమపిల్లలను అంపవలెను. ఈమహారేవర్ నెల అనంతరము చేర్చుకొనుట కష్టమగును. పాఠశాలనవాజ........సందులో మాజంజాహీ మార్కెటునుండి ఒకఫర్లాంగు దిలారములోనున్నది—ఆంధ్రులు అభిమానించి ఈపాఠశాలపై తమదృష్టిని ప్రసరింతురని కోరుచున్నాము.

(ఇట్లు కార్యదర్శి)

---

# విందులుచేస్తే జెయిలు! జాగ్రత్త!!

హైద్రాబాదురాష్ట్రములో ఎవరైనా విందులుచేసినప్పుడు ఒక్కొక్కదినానికి ౫౦ లేక వాంమందికంటె ఎక్కువమందిని భోజనానికి పిలిచితే వారికి మూడేండ్లవరకు జెయిలుశిక్షయైనన్నూ లేక జుర్మానయైనన్నూ లేక రెండునన్నూ విధింపబడును. ఈశాసనం హైద్రాబాదురక్షణశాసనము ప్రకారము చేసినారు.

---

# విశ్వబ్రాహ్మణ సేవాసంఘపు రెండవఎన్నికలు

సికింద్రాబాద్ పట్టణమందు రజిమెంటుబజార్ నందుగల శ్రీకాళికాదేవాలయమున ఆలిండియా విశ్వకర్మ బ్రాహ్మణ కేంద్ర ఫెడరేషన్ సంఘాద్యక్షులు బ్ర॥శ్రీ ....... నగరేశ్వర స్వామిగారి ఆధిపత్యములో ౧౫జూలై౧౮వ తేదీనజరిగిన పైసంఘపు కార్యదర్శి బ్ర॥ వరుటూరి గోవిందాచార్యుల గారు నివేదిక వినిపించిన పిదప బ్ర॥బి. జయసేనగారు,కులబాలురశిక్షణాస్త్రలు గట్టించవలెనని యుపన్యసించిరితర్వాత ఎన్నికలు జరిగెను పిడుజ రామస్వామిచార్యులు గారు అధ్యక్షులుగను. జయసేనగారు ఉపాధ్యక్షులుగను, వరుటూరి గోవిందాచార్యులు గారు కార్యదర్శిగను. చారుగుంద్ర బ్రహ్మంగారు సహాయకార్యదర్శిగను, కటుకూరి విశ్వనాథాచారి గారు. కోశాధ్యక్షుడుగను, లేఖకుడగను, యితరులుకొందరిని సభ్యులు గాను ఎన్నుకొనబడిరి.

---

# గోలకొండ డైరీలు

౧౩౫౩ఫసలీ గోలకొండడైరీలు సిద్ధమగుచున్నవి. మెహర్ నెలతుదివరకు సిద్ధముకాగలవు. ప్రకటనలుపంపువారు త్వరగా పంపవలెను. సిద్ధమగుటకుముందు వారముదినాలనుండి మేముపత్రికలో ప్రకటించుచుందుము.

---

# తప్పెవ్వరిదిన్నీ లేనట్లే!

గుల్బర్గా లూటీల విచారణ ఫలితము

హైద్రాబాదు ప్రభుత్వమువారు ౩ బహమన్ ౧౩౫౨నాడు అనగా రానెలక్రిందట గుల్బర్గాలో జరిగిన లూటీలవిషయములో ఒక విచారణసమితి నేర్పాటుచేసి తత్ఫలితము నీవిధముగా తెలియజేయుచున్నారు-

గుల్బర్గాలో తిండికిఇబ్బందియుండెను- కాని చాలాతావులతో నిలువధాన్యముండినది పెద్దవ్యాపారులునిలువబెట్టి ఎక్కువధరలకై ఎదురుచూచుచుండిరి. ఇట్లుండగా ధాన్యంకరువేర్పడునని ప్రజలు ఎక్కువగా కొనిపెట్టుకొన మొదలుపెట్టిరి- పెద్దవర్తకులు సహకారపడలేదు- స్థానికాధికారులు అమ్మకముకాలమును సంకుచితపరిచిరి. ౩ బహమన్‌నాడు మనిషికి రతలజొన్నలకంటే యెక్కువకొనరాదని శాసించిరి. గుల్బర్గాలోని మహిబూబుషాహీ మిల్లుకూలీలకు ధాన్యండిపో లేకపోయెను. వారిసిబ్బందియు ౩౦౦౦మంది తాలూక్దారుఇంటికి వెళ్లిరి. అతడు ౨౦౦ జొన్నలసంచుల మంజూరీయిచ్చెను. జిల్లాపోలీసుఅధికారి ఏమిన్ని అల్లరికాకుండా పోలీసుసిబ్బందితో హాజరయ్యెను. సాయంత్రము అయినవరకు తాలూక్దారు ఇంటివద్దయుండెను. కూలీలు వెళ్ళిపోగా సిబ్బందినికూడా పంపివేసెను. అంతలో మరొకగుంపు గుల్జారుహౌజువద్ద కూడెను. అది వృద్ధియయ్యెను. మళ్లీ పోలీసుజవానులను పంపువరకు రాత్రియైపోయెను. గుల్జారుహౌజువద్ద యీ యేర్పాట్లు జరుగగా వేరేతావులలో లూటీలుజరిగెనని వార్తలువచ్చెను. వచ్చినతర్వాత సిబ్బందివెళ్ళి లూటీ చేయువారిని చెదరగొట్టెను, వ్యాపారుల నష్టాలను కొందరు చాలా పెంచిచెప్పినారు, లూటీ చేసినవారిలో అన్నిజాతులవారుండిరి, కావున ఇదిఒకమతమువారు ఇంకొకమతము రిని లూటీ చేసిన విషయమని చెప్పరాదు-

---

# జిన్నాగారిపై కత్తిదెబ్బ

సావర్కరుగారి సానుభూతి

జులై ౨౬ తేది అపరాహ్ణమందు బొంబాయినగరంలో ముస్లింలీగుఅధ్యక్షులగు మహమ్మదల్లీ జిన్నాగారినిచూచుటకు వచ్చినఒక ముసల్మానుడు వారినికత్తితో కొట్టెను వారికిగాయమైనందున చేతిమీదను చిన్నగాయాలు మాత్రమయ్యెను. ఇంతలో నెఅతనినిపట్టుకొని పోలీసులకప్పగించిరి. అతడు ఖాక్సారుఅని అనుకొనుచున్నారు. ఈవిషయమై జులై ౨౭తేదిన హిందూమహాసభాధ్యక్షులగు సావర్కరుగారు "యునైటెడు ప్రెస్" కి తమఅభిప్రాయమిచ్చుచు జిన్నాగారిని ప్రాణముపై దెబ్బతీయప్రయత్నము జరిగినందుకు తమకుసంతాపమైనదనిరి. ముసల్మానుల క్షేమమునకై యత్నించువారలలో అగ్రగణ్యులైన జిన్నాగారిపై యిట్టి దుశ్చర్యకు పూనుకొనినవారు ముసల్మానుడైయుండుటచే జిన్నాగారికి కొంతకంగారు కలుగవచ్చుననియు ఇట్టిచర్యరాజకీయకారణ ప్రేరితమైనను, మతభావకారణప్రేరితమైనను ప్రజాహిత జీవనమునకు గొప్పకళంకమనియు చెప్పిరి.

---

# రాయలసీమలో క్షామము

విజయనగరం మహారాజకుమార్ సర్ విజయ గారు రాయలసీమలో క్షామపరిస్థితులను చూచి అక్కడిక్షామ బాధితుల కష్టములుతీర్చుటకై ధనము వసూలు చేయుటకుజులై ౨౭వ తేదిన బొంబాయికిపోయిరి. అక్కడి ఆంధ్రులు వారికిస్వాగతమిచ్చిరి.సర్ విజయాగారు రాయలసీమ బాధితులకు ధాన్యముగాని నీళ్లుగానిదొరకుట లేదనియు శిశువుల ఆహారము తల్లులకొకసమస్యయైనదని, మదరాసు ప్రభుత్వమువారు క్షామబాధితుల రక్షణకై ఏన్ని యోశిబిరములను పెట్టియున్నను, ప్రజలస్థితిఇంకను కష్టము గనేయున్నదనియు, ఆంధ్రమహాసభ వారుకొన్ని శిబిరములను ఏర్పాటుచేసి ఇదివరకు రూ౪౦౦౦౦లు వసూలుచేసి యున్నారనియు, ఒక లక్షరూపాయిలు కావలెననియుచెప్పిరి. నిధికి ఇంకనుధనమును వసూలుచేయుటకై ఆంధ్రమహాసభవారుబొంబాయికి శ్రీకొండా వెంకటప్పయ్యగారినిపంపించి యున్నారనియు — అబొంబాయి ఆంధ్రులతో చెప్పి వారలఉదారధన సహాయము నర్థించిరి.

······

# అప్పకూడని ఇండియా పటములు

కలకత్తాలోనైనచో పోలీసుకమిషనరుయొక్క అనుమతి ఇతరత్రనైనచో జిల్లామెజస్ట్రేటుయొక్క అనుమతిలేకుండ అంగుళమునకు ౩౨మైళ్ళను సూచించు ఇండియాదేశభాగపు పటమును దేనినిగాని అమ్మరాదని ఒకఆజ్ఞభారతరక్షణ నియమమును అనుసరించి నేకటు ప్రకటించబడినది.

---

# ఆనీగారు గాంధిగారిని దర్శింతురా

నాగపూరులో రాజకీయములయందు తిరుగుతున్న ఆనీగారు సింహళములో ఉద్యోగమునచేరుటకైపోవుటకు ముందుగాంధిగారిని దర్శింతురను ఒకవదంతిని జమాశాదాయని ఆనీగారిని పత్రికల ప్రతినిధియడుగగా ఆనీగారు ఆవదంతినిఖండించిరి

---

# రాజకీయఖైదీలదురవస్థ

తగ్గించుటకై శాసనసభలో వాదన

జులై ౨౭తేదిన క్రొత్తఢిల్లీలో అసెంబ్లీసమావేశమునందు టి.టి.కృష్ణమాచారిగారు ప్రవేశపెట్టిన ఒకతీర్మానములో రాజకీయఖైదీలు, డిటెనూ ఖైదీలకు సౌకర్యములను చేయువిషయమున ఇప్పటి ప్రభుత్వవిధానమును మార్చవలసియున్నదని సూచించబడినది. మరియు కేంద్రశాసనసభ్యులు ఆ ఖైదీలను చూడనీయవలెనని కోరబడినది. ఆతీర్మానమునుగురించి జరిగినఉపన్యాసములలో జెయిళ్ళయందు భూగర్భనిర్మాణములయందు రాజకీయఖైదీలనుంచి చాలా చిక్కులు పెట్టుచున్నట్లు చెప్పబడినది. ఇట్టికారణములచే సత్యమూర్తి, ప్రొఫెసర్ బోస్‌హిమన్సుగారలు మరణించిరనియు, ఇతరులు బ్రతికియున్నవారలు చాలఅనారోగ్యముపాలైరనియు చెప్పబడినది, పంజాబురాష్ట్రీయుడైన సభ్యుడగు సర్దారుమంగళసింగుగారు ఉపన్యసించుచు తానుపోయినసవంబరులో న్యాయస్థాన విచారణ లేనిబంధమునుండి వదలివేయబడినను, తానుఅయిదు దినములకంటె ఎక్కువమందిసభ్యులుగల సభలకు పోరాదని ఆజ్ఞాపించబడితిననియు, అందువల్లతాను అసెంబ్లీసమావేశమునకు పోవచ్చునాయని జిల్లామెజస్ట్రేటుగారినడుగగా మెజస్ట్రేటు అసెంబ్లీ సమావేశములో ఐదుగురికంటె ఎక్కువమంది యుండురుగనుకను, అదిమతసంబంధమైన సభకాదుకనుకను దానికిపోరాదని జవాబిచ్చెనని చెప్పినపుడు సభ్యులునవ్విరి. తానుమెజస్ట్రేటుయొక్క ఆజ్ఞకు విరుద్ధముగా అసెంబ్లీసభకువచ్చినందువల్ల పంజాబు ప్రభుత్వమువారు తనపైదావాచేయవచ్చునేమోయని భయముగానున్నదనిరి. ఈనకల్పితములైన ఈ చిక్కులన్నియు భారతదేశరక్షణ నియమావళిలోని ౨౬ నియమముయొక్క అమలుచే కలుగుచున్నవని మంగళసింగుగారుచెప్పిరి.

రాజకీయఖైదీలకును, డిటెన్యూఖైదీలకును జెయిళ్ళలో ఇప్పటికంటె మంచిసౌకర్యములను ఏర్పాటుచేయుటకును, వారలకుటుంబముల పోషణకై అవసరమైనచో తగినఏర్పాటు జేయుటకును, జైళ్ళబయటివారలతో ఉత్తరప్రత్యుత్తరపు సౌకర్యములను వారలకుఇప్పటికంటె ఎక్కువగా చేయుటకును, సాధ్యమైనంతత్వరలో వారలకేసులను గురించి నిష్పక్షపాతముగా పునర్విమర్శ చేయుటకును ప్రత్యేకముగనియుక్తమైన కేంద్రశాసనసభ సభ్యులతోగల ఒకఉపసంఘముయొక్క సలహాతోను, రాష్ట్రీయప్రభుత్వములసహకారముతోను ప్రభుత్వవిధానమును మార్చవలెనని యస్.యం. జోషిగారు ప్రతిపాదించినసవరణలో సూచితమైనది. ఈసవరణకుఅనుకూలముగ, ప్రతికూలముగ కూడ సమానముగ ౩౯ ఓట్లురాగా అధ్యక్షుడు తనఓటును ప్రతికూలముగనిచ్చుటచే సవరణవీగెను. ముస్లింలీగుపక్షపుసభ్యులుకూడ సవరణకు అనుకూలురలోనుండిరి. తుదకుఅసలుతీర్మానముకూడ వీగిపోయెను. అసలుతీర్మానమునకుకూడ ముస్లింలీగుపక్షపువారలు అనుకూలురైయుండిరి.

---

మొగలాయి కథలు

# ప్యారీసవారీ

జహాంగీరుచక్రవర్తి మహావైభవముతో భూలోకస్వర్గములో నున్నట్లుగా ఢిల్లీలోని దేవిడీలలో విహారారామములలో సకలసౌఖ్యా లనుభవించుచూ ఉండినాడు అతనికాలములో యూరోపుదేశమునుండి ఫ్రేంచివారు, ఇంగ్లీషువారు పోర్చుగీసువారు మనదేశముతో వ్యాపారాలు సాగించుచూ వచ్చిరి చక్రవర్తిగారిని ఏవిధంగానైనా మెప్పించి తమజాతికే ప్రత్యేకసౌకర్యాలను సంపాదించుకోవలెనని తెల్లజాతులవారు పోటీపడుచుండిరి అట్టివారిలో ఫ్రెంచిజాతివాడైనబర్నా (Bernard) అనువాడు అతనిలో రెండుగుణాలుండెను అతడు మంచివైద్యుడు శస్త్రచికిత్సలోనూ ప్రవీణుడు పైగా ఫార్సీభాషను నేర్చుకొని చక్రవర్తి చిత్తవృత్తిననుసరించి అతన్ని మెప్పించినవాడైనాడు చక్రవర్తికి సారాయి, సంగీతము, నృత్యము ఈ మూడున్నూ చాలా ప్రియమైయుండెను బర్నా కూడా ఇక చాలుఅని అనకుండా ఎన్నిమారులు గ్లాసులో సారాయినింపినా ఒకగ్రుక్కలో ఒక చుక్కకూడా మిగులకుండా మాయంచేసేవాడు జహాంగీరుకు బర్నాపై ప్రేమకుదిరింది దినమూ తనఆంతరంగిక వినోదాలలో ఉండుటకై అతనికి సెలవు దొరికింది

చక్రవర్తి వినోదాలలో ఎప్పుడుచూస్నా ఒక యువతిఉండేది సాధారణముగా విలాసవతులకు ఒకలోపముంటుంది రూపముంటేవిద్యయుండదు విద్యయున్నా కళయుండదు. సంగీతమునేర్చినా నృత్యమురాదు నాట్యము బాగావస్తే గొంతు బాగుండదు. ఇవన్నీకుదిరేఅప్పటికి అది ముసలిదైపోతుంది. ఈవిలాసవతిఅట్టిదికాదు దానివయస్సు ౨౦ఏండ్లే భువనమోహినివలె నిగనిగచ్ఛాయకలది నవాబులుపసందుచేసే అందముకలది నల్లనికండ్లు బారెడుజడ వంకరలుతిరిగిన ముంగురులు పండు మొగలిరేకువన్నె పుష్టిగలఅవయవములు పైగాపట్టుబట్టలతో రత్నాలసొమ్ములతో ఒంటినిండాఅలంకరించుకొన్నది సన్ననిమధురమైనగొంతు నాట్యములో అభినయములో బాగాగురుశిక్షపొంది పరిణతిపొందినది. ఒక చల్లనిచూపు చూస్తే చాలు ౧౦౦౦ దీనారాలిచ్చేవారున్నారు పల్లెత్తిపలుకరించితేచాలు ముత్యాలు దోసిలినిండాపోసే సర్దారులున్నారు ఒక దొంగ చిరునవ్వుతమపై విసరివేస్తేచాలు రత్నాలిచ్చే సుబేదారులున్నారు కాని ఆపిల్లఅంటే చక్రవర్తికి చాలాప్రేమ ఆయువతి యితరులను ఇక చిన్న చూపుతోనైనా చూస్తుందా. ఎన్నాళ్ళకు అట్టిదానిపై నపించుకోరానంతటి మనుమమించుకొని వచ్చింది ఊరకుండలేకపోయినాడు రహస్యంగా రాయబారాలు సాగించినాడు లాభంలేకపోయింది తానేస్వయంగా వ్యవహారం సాగించినాడు యువతితల్లి కఠినంగా మందలించింది బర్నా ఆనందమంతా ధ్వంసమైపోయెను విచారసాగరంలో మునిగిపోయెను. తాపము ఎక్కువైపోయెను చక్రవర్తితో మనుపటివలె సారాయిత్రాగడు మాట్లాడితే ఏదోవిధముగా జవాబిచ్చితప్పుకొంటూను చక్రవర్తి అది గమనించినాడు "ఏమోయ్, పికరులోపడినావు ఏమిసంగతి"అని ఒకమారుఅన్నాడు "చిత్తంచిత్తం ఏమీలేదు హుజూర్"అన్నాడు బర్నా ముక్తసరుగా

ఒకనాడు చక్రవర్తి భార్యలలో ఒకప్రియమైన బేగంసాహెబా జబ్బుపడెను దేవిడీ హకీములు మందులు మార్చిమార్చి చికిత్సచేసిరి రోగము ముదురుతూవచ్చెను ఇకఆమె బ్రతుకదనుకొన్నారు చక్రవర్తి దుఃఖముచూచి బర్నాయిట్లన్నాడు "హుజూర్, యీరుహకీములనే విచారించితిరి కాని ఇంతకాలముమీకు విశ్వాసపాత్రుడైన యీగులామును చికిత్సచేయుమని కోరకనేపోయితిరి కదా "సరే,నీవేచికిత్సచేయుమయ్యా" అన్నాడు హుజూరు బర్నా చికిత్సమొదలైనది నాలుగైదు దినాలలో రోగము తిరుగుమొగముపట్టినది బేగం మంచంలో లేచికూర్చున్నది. మరికొన్నాళ్ళకు జ్వరంవిడచింది ఇంకాకొన్నాళ్ళకు పూర్తిగానయమైంది. పాదుషా ఆనందానికి రెక్కలువచ్చెను-

చాలాదినాలకు మళ్ళా దర్బారుచేసినాడు యువరాజులు, సర్దారులు, సేనానులు, సుబేదారులు, జాగీర్దారులు, మన్సబ్దారులు దర్బారులో అలంకారాలతో హాజరైనారు

పాదుషా ప్రసన్నముఖుడై బర్నానుపిలిచినాడు "ఓయ్ నీవునాకు చాలా గొప్ప ఉపకారం చేసినావు నీకు నాచేతనైనట్టి ప్రతిఫల మియ్యవలచినాను ఏమికోరుకొంటావోకోరుకో"అనిఅన్నాడు

బర్నా చేతులు జోడించుకొని నమ్రుడైనిలిచినాడు క్రిందిచూపులుచూస్తూ ఏమిన్నీ పలుకలేదు. అందరూ ఆశ్చర్యచకితులైనారు

"ఏం ఆలోచించుతున్నావు నీవడిగినదియ్యననుకొన్నావా? ఇంతవిశాలమైనదేశమును పాలించేది నీవెరుగవా? అట్టిదేశములో నీవేదికోరుతావో చెప్పు సందేహంలేకుండాశిక్షా"అని పాదుషా అన్నాడు బర్నా తలవంచి కాలి గోరుతో నేలపై రాయుచూ మరల ఏమిన్నీపలుకకపోయెను.

"ఏం నీసందేహం? ఆజ్ఞైనా చెప్పు"

"జహాంపనాహ్-నేను ఉద్యోగాలను కోరను-రాజ్యాలనుకోరను- రత్నాలుకోరను-సర్కార్" అన్నాడు తిన్నగా బర్నా.

"మరేమికోరుతావోయ్ నీవు,

"జానెఆలం! నాప్యారీజాన్ ఒకటుంది- అది సర్కారువారి సమక్షములో నృత్యగానంచేస్తూ ఉంటుంది-సర్కార్ "అని పలికినాడు బర్నా

"ఓహో! అదికావలెనా నీకు ఎక్కడుందిఆ, ఈ నాడు కనబడలేదు"

"దర్బారుదర్వాజా కాచుకొనేఉంది హుజూర్"

"పిలువిచ్చినాం- ఇటు రమ్మను"

విలాసవతి గల్లుగల్లుమంటూ ఒయ్యారంగా తళతళలామెరుస్తూ మెరుపుతీగలాగా దర్బారులో ప్రవేశించింది-విలాసముగా నమ్రమై వంకరచూపులతో రత్నాలకంకణాలతో సలాము ఎజాయించి నేలచూపులుచూస్తూ నిలుచుకొన్నది

"ఒకె మాదర్బారీపరీని బర్నా భుజాలమీద కెత్తండిరా" అన్నాడు పాదుషా అట్లే ఆమెను బర్నా భుజంమీద కూర్చొబెట్టినారు-

"ఇకఅట్లే దాన్నితీసుకొని దౌడు తీయి" అని ఆజ్ఞాపించినాడు పాదుషా-

సలాముకొట్టుటకుకూడా లేకపోయింది ఒకే పరుగులో సుందరమగుసవారీని మోసుకొని బర్నా కనబడనంతవరకూ దౌడుతీసినాడు-దర్బారంతా నవ్వింది-హుజూరు ముసిముసి నవ్వులతో నిండిపోయినాడు-పరీ నవ్వింది- బర్నా కూడా నవ్వినాడు-బర్నా ఉల్లాసంగా జీవితవిశేషమంతా ప్యారీసవారీని మోసినాడు-

